WHAT ISLAM STANDS FOR?

(Telugu)

# ధర్మపథం

మూలం:

మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మాలై)

అనువాదం:

ఎస్.ఎమ్.మలిక్

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# ముందు మాట

1976 ఏప్రిల్ ప్రారంభంలో ఇస్లామిక్ కౌన్సిల్ ఆఫ్ యూరోప్ ఆధ్వర్యాన లండన్‌లో అంతర్జాతీయ ఇస్లామీయ మహాసభలు జరిగాయి. అందులో ప్రపంచంలోని పండితులు, తత్వవేత్తలు, అనేక మంది ఇస్లామ్‌కు సంబంధించిన వివిధ విషయాలపై తమ వ్యాసాలు సమర్పించారు. ప్రఖ్యాత తత్వవేత్త మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూదీని సయితం ఆ మహా సభల్లో ఆహ్వానించటం జరిగింది. కాని ఆయన అనారోగ్యం వల్ల అక్కడికి పోలేకపోయారు. వ్యాసం మాత్రం వ్రాసి పంపారు. వ్యాసాన్ని ప్రొఫెసర్ ఖుర్షీద్ అహ్మద్ ఏప్రిల్ 4న చదివారు.

మౌలానా అసలు ప్రతిలో, తాను చెప్పిన ప్రతి అంశానికి ఆధారాలు దివ్య ఖుర్‌ఆన్ ఆయత్‌లను, మహాప్రవక్త ముహమ్మద్ (స) ప్రవచనాలను అధఃసూచికల్లో ప్రస్తావించారు. మౌలానా ప్రస్తావించిన 16 అంశాల్లోని ఒక్కో అంశాన్ని సవివరంగా రాస్తే అదే ఒక పుస్తకమవుతుంది.

ఈ పుస్తకంలో ఇస్లామ్ మానవాళికి అందజేసే సందేశంలోని ప్రధాన అంశాలను పేర్కొనడం జరిగింది. ఇస్లామ్ సందేశాన్ని సమగ్రంగా, సంగ్రహంగా అర్థం చేసుకోడానికి ఇది ఉపకరిస్తుంది. అయితే సవివరంగా అర్థం చేసుకోదలచినవారు మౌలానా వ్రాసిన ఇతర ఇస్లామీయ సాహిత్యాన్ని అధ్యయనం చేయడం అవసరం.

- ప్రకాశకులు

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# ధర్మపథం

(1) ప్రారంభంలోనే ఒక విషయం విశదపరచడం అవసరం. మా నమ్మకం ప్రకారం, ఇస్లామీయ ధర్మం తొలిసారిగా ముహమ్మద్ (స) అందజేసిన ధర్మం కాదు. ఆ కారణంగా ఆయన్ని ఇస్లామ్ వ్యవస్థాపకుడు అనడం కూడా సరికాదు. ఖుర్ఆన్ ఈ విషయాన్ని ప్రస్ఫుటంగా తెలుపుతోంది. దైవం తరఫు నుండి మానవ జాతి కొరకు ఎల్లప్పుడూ ఒకే ధర్మం పంపబడింది. అదే ఇస్లామ్-అంటే దైవం ఎదుట మానవుడు తననుతాను పూర్తిగా సమర్పించుకోవటం, విధేయత అవలంబించడం ప్రపంచంలోని విభిన్న భాగాల్లో, వివిధ జాతుల్లో దైవం పంపగా వచ్చిన ప్రవక్తలందరు తమ ప్రత్యేక ధర్మం వ్యవస్థాపకులు కాదు. వారు తెచ్చిన ధర్మాన్ని నూహ్ మతం, ఇబ్రాహీమ్ మతం, మూసా మతం లేక క్రైస్తవ మతం (Christianity) అనడానికి, వచ్చిన ప్రతి ప్రవక్త, తనకు ముందు వచ్చిన ప్రవక్తలు అందజేసిన ధర్మాన్ని ప్రచారం చేస్తూనే వచ్చారు.

(2) ప్రవక్తల్లో ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) ప్రత్యేకత వాస్తవంలో ఏమంటే, (1) ఆయన దేవుని అంతిమ ప్రవక్త, (2) ఆయన ద్వారా దేవుడు ప్రవక్తలందరు తెచ్చిన నిజధర్మాన్నే తిరిగి పునరుజ్జీవింపజేశాడు. (3) అందులో ఆయా కాలాల ప్రజలు ఏ మార్పులు చేర్పులు చేసి వేర్వేరు మతాలు (Religions) స్థాపించుకున్నారో, వాటన్నిటినీ దేవుడు వేరుపరిచాడు. ముహమ్మద్ (స) ద్వారా నిజమయిన ఎలాంటి మిశ్రమం లేని ఇస్లామ్‌ను

మానవాళికి ప్రదానం చేశాడు. (4) ఆయన తరువాత మరో ప్రవక్త రాడు కాబట్టి ఆయనకు ప్రదానం చేసిన గ్రంథాన్ని, దాని అసలు భాషలో పొల్లుపోకుండా భద్రపరిచాడు. తద్వారా మనిషి ఎల్ల కాలాల్లోనూ మార్గదర్శకాన్ని పొందగలడు. దివ్యఖుర్‌ఆన్ గురించి ఎలాంటి మార్పులు చేర్పులు లేకుండా అచ్చంగా ముహమ్మద్ (స) అందజేసిన గ్రంథమే అన్న విషయం సకల విధాల సందేహాలకు అతీతమయింది. దాని అవతరణ కాలంలోనే మహాప్రవక్త ముహమ్మద్ దాన్ని వ్రాయించారు. ఆయన నిర్యాణం వరకు ఈ కార్యం సాగుతూనే వచ్చింది. ఆ సంపూర్ణ ఖుర్‌ఆన్‌ను ఆయన తొలి ఖలీఫా (ప్రాతినిధ్య పాలకుడు) గ్రంథస్థం చేయించి భద్రపరిచాడు. ఆ తరువాత మూడవ ఖలీఫా దాని నకలు ప్రతులు ఇస్లామీయ రాజ్యపు అన్ని కేంద్రాలకు పంపారు. ఆనాటి నుండి నేటి వరకు ప్రతి దేశంలో, ప్రతి శతాబ్దంలో అచ్చయిన ఖుర్‌ఆన్ ప్రతుల్ని పరిశీలించి చూస్తే వాటిలో ఎలాంటి వ్యత్యాసం గోచరించదు. ఇదికాక, నమాజ్‌లో ఖుర్‌ఆన్ పఠించే ఆదేశం, మహాప్రవక్త దౌత్యం ప్రారంభమయిన దినానే ఇవ్వడం జరిగింది. అందువల్ల వందల కొలది ప్రవక్త సహచరులు పూర్తి ఖుర్‌ఆన్‌ను, సహచరులందరూ దాని ఏదో ఒక భాగాన్ని మహాప్రవక్త జీవితంలోనే కంఠస్థం చేసుకున్నారు. ఆ దినం నుండి ఈ దినం వరకు దివ్య ఖుర్‌ఆన్‌ను మాటమాటకు కంఠస్థం చేసుకునే, ప్రతి ఏడాది రమజాన్ నెలలో తరావీహ్ నమాజ్‌లో పూర్తి ఖుర్‌ఆన్‌ను నోటితో వినిపించే సదాచారం ఇస్లామీయ ప్రపంచంలో రివాజులో ఉంటూ వస్తూంది. ఎల్లప్పుడు లక్షల కొలది ఖుర్‌ఆన్ స్మర్తలు ఉంటూ వచ్చారు. ప్రపంచంలోని ఏ మత గ్రంథమైనా దాని ప్రామాణికతలో ఏ మాత్రం సందేహం కలగకుండా ఉండటానికి ఈ విధంగా వ్రాతపూర్వకంగా గ్రంథస్థం చెయ్యబడో లేక స్మర్తల ద్వారా కంఠస్థం చెయ్యబడో సురక్షింపబడలేదు. (5) స్వయంగా ఆయన ప్రవక్త (స) చరిత్రను, ఆయన

సంప్రదాయాలను ఆయన సహచరులు, ఆ తరువాత ముహద్దిస్‌లు (హదీసువేత్తలు) ఎంతో అద్వితీయంగా భద్రపరిచారు. అంతకంటే సురక్షితమైన విధానం ద్వారా ఒక ప్రవక్త లేక ఒక చారిత్రక వ్యక్తి జీవిత వివరాల్ని, ఆయన సూక్తులను, చేతలను భద్రపరచడం ఇంతవరకు జరగలేదు. స్థూలంగా చెప్పాలంటే ఆ విధానం ఇది; ఏ వ్యక్తి అయినా ముహమ్మద్ (స)కు ఆపాదించి ఏదైనా మాట తెలిపితే, తనకు ఏ ఏ రావీల ద్వారా ఆ మాట అందినదో అతడు తెలుపడం అనివార్యం. ఆ విధంగా రివాయత్‌ల పరంపర, స్వయంగా మహా ప్రవక్తను, ఆ మాట పలుకగా విన్న వ్యక్తి లేక ఆ పనిని చెయ్యగా చూచిన వ్యక్తి వరకు చేరుతుందా లేదా అన్న విషయం గమనించబడేది. వారు వివరించిన రివాయత్‌లు విశ్వసనీయమయినవా కావా అన్న విషయం తేల్చడానికి ఏ ఏ వ్యక్తుల ద్వారా అవి తరువాత వారికి అందాయో వారి స్థితిగతులు విచారించబడ్డాయి. ఈ విధంగా హదీసుల సంకలనాలు కూర్చబడ్డాయి. వీటి సంకలన కర్తలు ప్రతి హదీసు వక్తల సంపూర్ణ పరంపరను గ్రంథస్థం చేశారు. వీటితో బాటు ఆ వక్తల స్థితిగతులపై కూడా గ్రంథాలు పొందుపరిచారు. వీటి ద్వారా మహాప్రవక్త జీవితం ఎలా గడిచేదో, ఆయన తన మాటలు, చేతలతో ప్రజలకు ఏ బోధలు చేశారో మనం నేటికీ పరిశోధించి తెలుసుకోగలం. (6) ఈ విధంగా దివ్య ఖుర్‌ఆన్, దాన్ని తెచ్చిన ప్రవక్త ప్రామాణిక జీవిత వివరాలు, సంప్రదాయాలు, ఇవి రెండూ చేరి, అల్లాహ్ అసలు ధర్మం ఏమిటో, అది మనకు ఇచ్చే మార్గదర్శకత్వమేమిటో, అది మన నుండి కోరేదేమిటో తెలుసుకోడానికి విశ్వసనీయమయిన ఆధారంగా ఏర్పడ్డాయి.

(3) మేము ముహమ్మద్ (స)కు ముందు ప్రభవించిన ప్రవక్తలందరిపై- ఖుర్‌ఆన్‌లో పేర్కొనబడినవారిపై మరింకా ఎవరి ప్రస్తావన దివ్య ఖుర్‌ఆన్‌లో రాలేదో వారిపై కూడా- విశ్వాసం కలిగి ఉంటాము. ఈ నమ్మకం మా విశ్వాసం

లోని అనివార్యమైన భాగం, ఇది లేకుండా మేము ముస్లిమ్‌లమే కాజాలము. అయితే మార్గదర్శకత్వానికై మేము కేవలం ముహమ్మద్ (స) వైపునకే మరలుతాము, ఇది ఏ విధమయిన పక్షపాతం వల్ల మాత్రం కాదు. వాస్తవానికి దానికి కారణమేమంటే: (1) ఆయన అంతిమ ప్రవక్త. అందువల్ల ఆయన తెచ్చిన శిక్షణ దైవం తరఫు నుండి వచ్చిన అత్యంత అంతిమ మార్గదర్శకత్వం (Latest Dispensation). (2) ఆయన ద్వారా మనకు దొరికిన దైవ వచనం (Word of God) స్వచ్ఛమైన తాజా దైవ వాక్కు. దీనిలో ఎలాంటి మానవీయ వచనం మిళితమవలేదు. ఇది దీని అసలు భాషలో సురక్షితంగా ఉంది. దీని భాష ఒక సజీవమయిన భాష, ఆ భాషను మాట్లాడేవారు, వ్రాసేవారు, అర్థం చేసుకునేవారు నేటికీ కోటానుకోట్ల మంది ప్రజలు ఉన్నారు. దీని వ్యాకరణం, శబ్ద సముదాయం, నానుడులు, ఉచ్చారణలు, వాక్య నిర్మాణాలలో ఖుర్‌ఆన్ అవతరణ కాలం నుండి నేటి వరకు ఎలాంటి పరివర్తన కలగలేదు. (3) ఇంతకు ముందే చెప్పినట్లు, ఆయన గుణగణాలు, స్వభావం, మాటలు, చేతలు వీటన్నిటి చారిత్రక భోగట్టా అత్యంత ప్రామాణికంగా వీలయినన్ని వివరాలతో భద్రంగా ఉంది. ఈ విషయాలు ఇతర ప్రవక్తల ఎడల వర్తించవు కాబట్టి మేము వారిపై కేవలం విశ్వాసం కలిగి ఉంటామే కాని, క్రియాత్మకంగా వారిని అనుసరించలేము.

(4) మా నమ్మకం ప్రకారం మహాప్రవక్త (స) దైవ దౌత్యం యావత్ప్రపంచాన్ని సర్వకాలాలనూ ఆవరించి ఉంది. ఎందుకంటే, (1) దివ్య ఖుర్‌ఆన్ దీన్ని వివరించింది. (2) ఆయన అంతిమ ప్రవక్త అవడంచేత దాని తార్కిక పర్యవసానం కూడా ఇదే. ఎందుకంటే, ఒక ప్రవక్త ప్రపంచంలో కడపటి ప్రవక్తగా ప్రభవించడం వల్ల, ఆయన మానవాళికంతటికీ, రాబోయే కాలాలన్నిటికీ మార్గదర్శకుడు అవడం అనివార్యం. (3) మనిషి రుజుమార్గంపై నడవగలగడానికి అవసరమయిన మార్గదర్శకత్వం ఆయన ద్వారా అత్యంత పరిపూర్ణంగా

ప్రసాదించడం జరిగింది- ఆయన అంతిమ ప్రవక్త అవడానికి సహేతుకమయిన పర్యవసానం కూడా ఇదే- ఎందువల్లనంటే సంపూర్ణ మార్గదర్శకత్వం లేకుండా పంపబడిన ప్రవక్త అంతిమ ప్రవక్త కాజాలడు. పైగా ఆయనకు పిదప మరో ప్రవక్త అవసరం కూడా మిగిలిపోతుంది. (4) వాస్తవానికి గత 14 వందల ఏళ్ళలో తాను దైవం తరపున పంపబడ్డ ప్రవక్త అని ప్రకటించడంతోపాటు తన స్వరూప, స్వభావాల దృష్ట్యా తన మాటలు, చేతల రీత్యా దైవ ప్రవక్తలతో ఇసుమంతయినా పోలిక కలవాడు, తనపై దైవవాణి అవతరిస్తుందని ప్రకటించి దైవ గ్రంథంతో ఏ మాత్రమైనా సామ్యంకల ఏదైనా గ్రంథం సమర్పించినవాడు, ఎవరినైతే శాసన ప్రదాత (Law giver) అయిన ప్రవక్త అనడం సాధ్యమో, అలాంటి వ్యక్తి ప్రభవించకపోవడం ఒక యదార్థ విషయం.

(5) ఈ సందర్భంలో, కేవలం దైవ ప్రవక్తల ద్వారా మాత్రమే ప్రసాదించబడిన, దైవం తరపున మనిషికి అవశ్యంగా చేరవలసిన ఆ ముఖ్య జ్ఞానం ఏదో తెలుసుకోవడం కూడా అవసరమే.

ప్రపంచంలో ఒక కోవకు చెందిన పదార్థాలేవంటే, మనం వాటిని మన పంచేంద్రియాల ద్వారా గ్రహించి లేదా మన వైజ్ఞానిక యంత్రాల (Scientific Instruments)ను వినియోగించి వాటి అవగాహన పొందగలుగుతాము. వీటి ద్వారా లభ్యమయ్యే విషయజ్ఞానాన్ని మన పరిశీలనా అనుభవాలు, చింతనా నిదర్శనాల సహాయంతో క్రోడీకరించి సరిక్రొత్త పరిణామాలను చేపట్టవచ్చు. ఈ కోవకు చెందిన పదార్థ జ్ఞానం దైవం తరపున రానవసరం ఉండదు. ఇది మన అన్వేషణ, ఆలోచన, పరిశీలన, పరిశోధన, పరిష్కారాల పరిధిలోనిది. అయితే ఈ విషయంలోనూ మన సృష్టికర్త మనల్ని పూర్తిగా వదలి వేయలేదు. మనకు తెలియకనే ఆయన గత కాలంలో ఒక క్రమం ప్రకారం తాను సృష్టించిన జగత్తును మనకు పరిచయం చేస్తూ వచ్చాడు. విద్యావిజ్ఞాన

కవాటాలను మనకై తెరుస్తూ వచ్చాడు. అప్పుడప్పుడు దైవిక ప్రేరణ ద్వారా ఎవరో ఒక మనిషికి ఏదో ఒక క్రొత్త విషయం మనసులో స్ఫురించేలా చేస్తూ వచ్చాడు. తద్వారా ఆ వ్యక్తి ఒక క్రొత్త ప్రకృతి సిద్ధాంతాన్ని కనిపెట్టగలిగాడు. అయితే మొత్తానికి ఇది మానవ విజ్ఞాన పరిధిలోనిదే. దీనికై దైవం తరపున ఒక ప్రవక్త, ఒక గ్రంథం వచ్చే ఆవశ్యకతలేదు. ఈ పరిధిలో ఏ విషయ జ్ఞానం అవసరమో దాన్ని పొందే మార్గాలు మనిషికి అందుబాటులోనే అనుగ్రహించబడ్డాయి.

రెండవ కోవకు చెందిన విషయాలు మన జ్ఞానేంద్రియాలకు, మన వైజ్ఞానిక యంత్రాతీతమయినవి. వాటిని మనం కొలవనూలేము, తూయనూలేము. లేదా మనవద్ద ఉన్న విజ్ఞాన సాధనాలను వినియోగించి వాటిని గురించి "జ్ఞానం" (Knowledge) అనిపించుకోగల స్థాయికి చేరుకోనూజాలము. తత్వవేత్త లేక శాస్త్రవేత్త వీటిని గురించి ఏదైనా అభిప్రాయం కలిగి ఉంటే అది కేవలం ఊహ, అంచనా అనుమానాలు (Speculation) మాత్రమే కాగలదు. దాన్ని "జ్ఞానం" అనడం అసాధ్యం. ఈ విషయాలు అంతిమ సత్యాలు (Ultimate Realities). వీటికి సంబంధిత తార్కిక సిద్ధాంతాలను ఆ సిద్ధాంత కర్తలు సయితం విశ్వసనీయములైనవిగా రూఢీగా చెప్పలేరు, వారు తమ "జ్ఞానం" పరిధిని ఎరిగినవారయితే వాటిని తామూ నమ్మలేరు, మరి ఇతరులనూ నమ్మమని ఆహ్వానించలేరు.

ఈ పరిధిలోనే సత్యాన్ని గ్రహించడానికి మనిషికి విశ్వకర్త ప్రసాదించిన జ్ఞానం అవశ్యమయింది. అయితే ఈ జ్ఞానం ప్రసాదించేందుకు సృష్టికర్త ఎన్నడైనా ఒక గ్రంథాన్ని ముద్రించి ఒక్కొక్క మనిషి చేతిలో పెట్టి దాన్ని చదివి ఈ విశ్వానికీ, స్వయంగా నీకూ సంబంధించిన సత్యం ఏమిటో, ఆ సత్యానికనుగుణంగా ఐహిక జీవితంలోని వైఖరి ఏమై ఉండాలో తెలుసుకొమ్మని అతనితో చెప్పలేదు. ఈ జ్ఞానాన్ని మనుషులకు అందజేయడానికి ఆయన సదా

దైవ ప్రవక్తలనే ఆధారంగా తీసుకున్నాడు. వహీ ద్వారా వారికి సత్యాలను తెలిపాడు, వారు ఈ జ్ఞానాన్ని ఇతరులకు అందజెయ్యాలని వారిని నియుక్తులు చేశాడు.

(6) ప్రవక్త కర్తవ్యం కేవలం ప్రజలకు వాస్తవికతా జ్ఞానం అందజేయడం వరకు మాత్రమే కాదు. ఈ జ్ఞానానికనుగుణంగా దైవం మనిషి మరియు మనిషీ, మనిషీ మధ్య ఉన్న యదార్థ సంబంధం ఏది, క్రియాత్మకంగా ఉండవలసిన సంబంధం ఏది అన్న విషయం తెలుపడం కూడా ఆయన కర్తవ్యమే. ఇంకా, ఈ జ్ఞానం మనల్ని కోరే విశ్వాసాలు ఏవి? ఆరాధనలు ఎలా ఉండాలి, నీతి ఏదీ, సాంస్కృతిక నాగరికతా సిద్ధాంతాలు ఏవై ఉండాలి అన్న విషయాలు, ఈ జ్ఞానం రీత్యా మన సామాజిక, ఆర్థిక, రాజకీయ, న్యాయరంగాలు, సంధిసమరాలు, అంతర్జాతీయ సంబంధాలు తదితర జీవిత శాఖలు ఏ సూత్రాలపై ఆధారపడి ఉండాలి అన్న విషయాలు కూడా ఆయనే చూపెట్టాలి. ప్రవక్త కేవలం ప్రపంచ పరిభాషలో మతం (Religion) అని చెప్పబడే ఒక్క ఆరాధనలు, ఆచారాల వ్యవస్థ (Rituals and worship)నే తీసుకురాడు, ఆయన ఒక పూర్తి జీవన వ్యవస్థను తీసుకువస్తాడు. దాని పేరు ఇస్లామ్ పరిభాషలో "దీన్" (Way of Life) జీవిత విధానం అని.

(7) ప్రవక్త ధ్యేయం "దీన్" జ్ఞానం అందజేయడం వరకు పరిమితమయింది కూడా కాదు. ఎవరయితే ఆయన అందజేసిన దీన్‌ను స్వీకరించి ముస్లిమ్‌లు అవుతారో వారికి దీన్‌ని బోధించాలి; దాని విశ్వాసాలు, నైతికత, ఆరాధనలు, శాసనాలు, సంపూర్ణ జీవన వ్యవస్థను వారికి తెలుపాలి; వారి సమక్షంలో స్వయంగా తాను ఒక ఆదర్శ ముస్లిమ్‌గా కనబడాలి. తద్వారా వారు తమ జీవితంలో ఆయన్ని అనుసరించగలగాలి. వారికి వ్యక్తిగతంగా, సామూహికంగా తర్ఫీదు ఇచ్చి నిజమైన ఇస్లామీయ సంస్కృతీ నాగరికతల

కొరకు వారిని క్రియాత్మకంగా స్థిరపరచాలి; వారు ప్రపంచంలో దైవధర్మాన్ని క్రియారూపంలో స్థాపించడానికి దైవవాణి అత్యున్నతమై, ఇతర వాణులు అణిగిపోయేలా కృషి చెయ్యడానికి వారిని సంఘటితపరచి ఒక సంఘంగా రూపొందించాలి. ప్రవక్తలందరు తమ ఈ ధ్యేయాన్ని చివరి వరకు విజయవంతం చేయడంలో సఫలీకృతులై తీరవలసిందే అన్న షరతు లేదు. చాలా మంది ప్రవక్తలు, ఏదో తమ తప్పు వల్ల కాదు, పక్షపాత బుద్ధిగల జనుల అడ్డు వల్ల, పరిస్థితుల అననుకూలత వల్ల దీన్ని అంతిమ దశ వరకు తీసుకుపోలేక పొయ్యారు. ఇంతకూ ప్రవక్తలందరి ధ్యేయం ఇదే. అయితే ముహమ్మద్ (స) ఈ విశేషత చరిత్రలో ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. ఆయన దేవుని రాజ్యం ఏ విధంగా ఆ లోకంలో ఉందో, అదే విధంగా ఈ లోకంలోనూ స్థాపించి చూపారు.

(8) దివ్య ఖుర్‌ఆన్ మరియు మహాప్రవక్త ముహమ్మద్ (స) ఆది నుంచే తమ సంబోధనలో యావత్ మానవాళిని సామాన్యంగా పేర్కొన్నారు. లేదా, మానవుల్లో నుంచి ఎవరు ఇస్లామ్ సందేశాన్ని స్వీకరించారో వారిని విశ్వాసుల వటాన వేరుగా సంబోధించారు. దివ్య ఖుర్‌ఆన్‌ని మొదటి నుండి చివరి వరకు పరిశీలించండి; మహాప్రవక్త ముహమ్మద్ (స) ప్రసంగాలు సంభాషణలు, రికార్డును మొత్తాన్నీ పరీక్షించండి. ఈ గ్రంథం, దీన్ని అందజేసిన సందేశహరుడు ఒక ప్రత్యేక దేశానికీ, జాతికీ, కులానికీ, వర్ణానికీ, లేక వర్గానికి చెందినవారినో లేదా ఒక ప్రత్యేక భాష మాట్లాడేవారినో పిలిచినట్లు మీరు చూడలేరు. ప్రతి చోట, "ఓ ఆదమ్ సంతానమా!" లేక "ఓ మానవులారా!" అని మానవాళినంతటినీ ఇస్లామ్‌ను స్వీకరించేందుకు ఆహ్వానించడం జరిగింది. ఇంకా ఇస్లామ్‌ను స్వీకరించిన వారికి ఆదేశాలు, ఆజ్ఞలు ఇవ్వడానికిగాను, "విశ్వాసం స్వీకరించిన ఓ ప్రజలారా!" అని సంబోధించడం జరిగింది. దీని ద్వారా స్పష్టంగా దానంతట అదే విశదమయ్యేదేమిటంటే, ఇస్లామ్ సందేశం విశ్వజనీనమైంది (Universal),

ఏ మనుషులయితే ఈ సందేశాన్ని స్వీకరిస్తారో వారంతా సమాన హక్కులతో సమ స్థాయికల మోమిన్‌లు విశ్వాసులు (Believers). దివ్యఖుర్‌ఆన్ అంటుంది: "విశ్వాసంతో స్వీకరించినవారయితే ఒకరికొకరు సోదరులు." మహాప్రవక్త ముహమ్మద్ ప్రవచించారు: "ఎవరయితే ఇస్లామ్ విశ్వాసాలను స్వీకరిస్తారో, ముస్లిముల్లాంటి వైఖరిని అవలంబిస్తారో, వారికి మాకున్న అధికారాలే ఉంటాయి, మాకున్న బాధ్యతలే వారికి ఉంటాయి." ఇంతకంటే విశదంగా మహాప్రవక్త ఇలా చెప్పారు: "వినండి, మీ ప్రభువు కూడా ఒక్కడే, మీ తండ్రి (ఆదమ్) కూడా ఒక్కడే. ఒక అరబ్బునకు అరబ్బేతరునిపైగాని, ఒక అరబ్బేతరునికి అరబ్బుపైగాని ఎలాంటి ఆధిక్యత లేదు. నల్లవానికి తెల్లవానిపై, తెల్లవానికి నల్లవానిపై ఎలాంటి ఆధిక్యత లేదు. ఆధిక్యత అనేది ఏదయినా ఉంటే అది కేవలం దైవభీతి ఆధారంగానే ఉంటుంది. మీలో అందరికంటే అధికంగా భయభక్తులు కలవాడే మీలో అందరికంటే అధికంగా అల్లాహ్ సమక్షంలో ఆదరణీయుడు."

(9) ఇస్లామ్ పునాదులు ఏ విశ్వాసాలపై ఉన్నాయో వాటిలో అన్నిటికంటే ప్రధానమైంది, ముఖ్యమైంది ఒకే దేవునిపై విశ్వాసం. కేవలం దేవుడు ఉన్నాడని మాత్రమేకాదు, ఇంకా ఆయన ఒక్కడే అన్న విషయం మాత్రమే కూడా కాదు, ఆయన ఒక్కడే ఈ విశ్వానికి కర్త, యజమాని (Master), శాసకుడు (Ruler), పాలకుడు (Administrator), ఆయన నిలబెట్టడం వల్లనే యావత్ జగత్తు స్థిరంగా ఉంది, ఆయన నడపటం చేతనే నడుస్తోంది. దీనిలోని ప్రతి వస్తువు స్థాపన, స్థిరత్వాల కొరకు కావలసిన ఉపాధి (Subsistence) లేక శక్తిని అందజేసేవాడు ఆయనే, సర్వాధికార గుణాలన్నీ (Attributes of Sovereignty) కేవలం ఆయనలోనే ఉన్నాయి. వాటిలో ఆయనతో పాటు ఏ ఒక్కడయినా, ఏ మాత్రమయినా భాగస్వామికాడు. దైవత్వపు సకల

గుణాలు కేవలం ఆయనే కలిగి ఉన్నాడనీ, వీటిలో ఏ ఒక్క గుణమయినా ఆయనకు తప్ప ఇతరులకు లభ్యమవలేదని, సృష్టినంతటినీ ఇందులోని ఒక్కొక్క వస్తువును ఆయన ఒక్క దృష్టిలోనే చూస్తూ ఉన్నాడనీ, సృష్టినీ, ఇందులోని ప్రతి వస్తువును దాని వర్తమానాన్నే కాదు, భూత భవిష్యత్కాలాలను సయితం ఆయన ప్రత్యక్షంగా ఎరుగును. ఈ సర్వ వ్యాప్తమయిన దృష్టి, ఈ సమగ్రమైన అగోచర జ్ఞానం ఆయనకు తప్ప మరెవ్వరికీ లేదు. ఆయన అద్యంతరహితుడు, శాశ్వతంగా ఉంటాడు. ఆయన తప్ప సర్వమూ నాశన మయ్యేదే. తనంతట తానే జీవిస్తూ స్థిరంగా ఉండేవాడు ఆయన మాత్రమే. ఆయన ఎవ్వరికీ పుట్టలేదు, కేవలం ఆయన తప్ప జగత్తులో ఉన్నదంతా ఆయన సృష్టి మాత్రమే. విశ్వప్రభువు (Lord of Universe)కు ఏ భావంలోనూ సమ జాతీయుడు, లేక ఆయన పుత్రుడు, లేక పుత్రిక అనగలిగే అంతటి స్థానం విశ్వంలో ఎవ్వరికీ లేదు. ఆయనే మనిషి వాస్తవ ఆరాధ్యుడు. ఆరాధనలో మరెవరైనా ఆయనకు తోడు కల్పించడం మహాపాతకం, గొప్ప విశ్వాస ఘాతుకం (Inficefity). ఆయనే మనుషుల మొరలాలకించేవాడు, వాటిని స్వీకరించడానికో లేక తృణీకరించడానికో అధికారం ఆయనకే ఉంది. ఆయనను వేడుకోకపోవడం అక్కరకు రాని గర్వం. ఆయన్ని తప్ప ఇతరుల్ని అర్థించడం అజ్ఞానం, ఆయనతోపాటు ఇతరుల్ని అర్థించడం దైవేతరుల్ని దైవంతోపాటు దైవత్వంలో భాగస్వాములుగా చెయ్యడం.

(10) ఇస్లామ్ ప్రకారం దేవుని సర్వాధికారం కేవలం ప్రకృతికి అతీతమైన విషయాల్లోనే కాదు, రాజకీయ శాసనపరమయినది కూడా. ఈ సర్వాధికారంలోనూ ఆయనకు మరెవ్వరూ తోడు లేరు. ఆయన భూమిపై, ఆయన సృజించిన మానవులపై ఆయనకు తప్ప మరెవ్వరికీ ఆజ్ఞలు చెలాయించే అధికారం లేదు. ఒక రాజు అయినా, రాజ కుటుంబమైనా, పాలకవర్గమైనా లేక ప్రజల సర్వాధి

కారాలు*(Sovereignty of the People)ను ఒప్పుకునే ప్రజాస్వామ్యమయినా- ఆయనకు ఎదురుగా ఎవరు సర్వ స్వేచ్ఛాధికారులుగా నిలుస్తారో వారూ తిరుగుబాటుదారులే, ఆయన్ని కాదని ఇతరుల విధేయతను పాటించేవారు కూడా తిరుగుబాటుదారులే. ఇంకా ఇదే విధంగా రాజకీయ శాసనాంగపరమైన సర్వసత్తాకమును తన కొరకు కేటాయించుకుని దేవుని అధికార పరిధి (Jurisdiction)ని వ్యక్తిగత చట్టాల (Personal Law) వరకు లేదా మత సంబంధమయిన ఆదేశాలు, నిర్దేశాల వరకు పరిమితం చేసే వ్యక్తి అయినా, సంస్థ అయినా తిరుగుబాటుదారులే. వాస్తవానికి తన భూమిపై సృజింపబడ్డ మానవులకు శాసనాంగాన్ని ప్రసాదించేవాడు (Law Giver) ఆయన తప్ప మరెవ్వరూ కారు, కాజాలరు. ఇంకా ఆయన సర్వోన్నత అధికారాన్ని (Supreme Authority) సవాలు చేసే హక్కు మరెవ్వరికీ లేదు.

(11) ఇస్లామ్ సూచించే దేవుని ఈ భావన దృష్ట్యా కొన్ని విషయాలు సహజంగా తప్పనిసరవుతాయి. (1) దేవుడు ఒక్కడే మనిషి ఆరాధనకు అర్హుడు: ఆయన తప్ప మరొకరిని మనిషి ఆరాధించేందుకు అంతటివారు మరెవ్వరూ లేరు. (2) ఆయన ఒక్కడే సర్వ శక్తులకు అధికారి. మనిషి వేడుకను నెరవేర్చడం లేక నెరవేర్చకపోవడం పూర్తిగా ఆయన అధీనంలోనే ఉంది. అందువల్ల మనిషి కేవలం ఆయన్నే అర్థించాలి. ఇంకా మరొకరిని కూడా అర్థించవచ్చు అని కేవలం 'ఊహామాత్రంగా కూడా ఇంకొకరి విషయంలో భావించరాదు.' (3) ఆయన ఒక్కడే మనిషి అదృష్టానికీ (Destiny) స్వామి, మనిషి విధిని వక్రపరచడానికి లేక చక్కబరచడానికి ఇంకొకరికి స్తోమత లేదు. అందువల్ల మనిషి ఆశలు, ఆందోళనలకు కేంద్రం కూడా తప్పనిసరిగా ఆయనే. ఆయన

*ప్రజల పాలనాధికారాల ప్రస్తావన ఇక్కడ లేదు. (Government of the People)

తప్ప మరెవ్వరి ఎడలయినా ఆశలు కలిగివుండరాదు, భయమూ కనబరచ కూడదు. (4) మనిషికీ, అతని చుట్టుపట్ల ఉన్న జగత్తుకూ సృష్టికర్త, స్వామి ఆయన ఒక్కడే. అందువల్ల మనిషి వాస్తవికత, యావత్ జగత్తు వాస్తవికతను ప్రత్యక్షంగా సంపూర్ణంగా ఎరిగిన వాడు ఆయనే, ఆయనే కాగలడు కూడా. కాగా జీవితంలోని చిక్కులతో కూడుకున్న (Complicated) మార్గాల్లో మనిషికి సరయిన మార్గదర్శకత్వం, నిజమైన జీవిత నియమావళి ఆయనే ఇవ్వగలడు. (5) ఇంకా మానవుని సృజనకర్త, స్వామి ఆయనే, ఆయనే మానవుడు నివసించే భూమికి స్వామి కావడం చేత మానవునిపై మరొకని ప్రభుత్వం లేక స్వయంగా అతని ప్రభుత్వం సొంతం దైవధిక్కారమే. ఇలాగే మనిషి స్వయంగా తన కొరకు శాసన ప్రదాత (Law Giver)గా తయారవడం లేదా మరొక వ్యక్తి లేక వ్యక్తుల లేక సంస్థల పట్ల శాసన నిర్మాణాధికారాన్ని అంగీకరించడం కూడా ఈ కోవకు చెందినదే. తన సృష్టికి పరిపాలకుడు, శాసననిర్మాత కేవలం ఆయనే కాగలడు. (6) సర్వోన్నత అధికారంకల నిజమైన స్వామి కావడం చేత ఆయన శాసనం వాస్తవానికి సర్వోన్నత శాసనం (Supreme Law), మనిషికి శాసన నిర్మాణ (Legislation) అధికారం కేవలం ఆ సర్వోన్నత శాసనానికి లోబడి, దానికి ఆధారభూతమై లేక అది ఇచ్చే అనుజ్ఞలపై ఆధారపడి ఉన్నంత మేరకే పరిమితమై ఉంది.

(12) ఇక ఇస్లామ్ సూచించే రెండవ అతి ముఖ్యమైన మౌలిక విశ్వాసం మనకు గోచరిస్తుంది. అది రిసాలత్ (దైవదౌత్యం)పై విశ్వాసం ఎవరి ద్వారా దైవం తన నియమావళిని మానవునికి అందజేస్తాడో ఆయనే రసూల్ (దైవదూత) సందేశహరుడు - దైవప్రవక్త. ఈ నియమావళి దైవ సందేశహరుని ద్వారా మనకు రెండు విధాలుగా లభిస్తుంది. ఒకటి దైవవాణి. అది ఒక్కొక్క పదమే దైవ సందేశహరునిపై అవతరింపబడింది. అంటే దివ్యఖుర్ఆన్. రెండవది, దైవ

ప్రవక్త తన అనుచరులకు దైవ నిర్దేశాల కనుగుణంగా అందజేసిన మాటలు, చేతలు చేయవలసినవిగా, చేయరానివిగా ఇచ్చిన ఆదేశాలు అంటే సున్నత్ (సంప్రదాయం). ఈ విశ్వాస ప్రాముఖ్యత ఏమంటే, ఇది లేకపోతే దేవునిపై నమ్మకం కేవలం ఒక సైద్ధాంతిక (Theoretical) ఆలోచనగా, భావనగా మాత్రం రూపొందుతూంది. ఉదాహరణకు, దైవ విశ్వాసాన్ని ఒక సంస్కృతిగా, నాగరికతగా, ఒక జీవన వ్యవస్థగా రూపొందించేది దైవ ప్రవక్త సైద్ధాంతిక (Ideological), ఆచరణాత్మక మార్గదర్శకత్వమే. ఆయన ద్వారానే మనకు నియమావళి లభిస్తుంది. ఆయనే ఆ నియమావళి కోరిన విధంగా జీవన వ్యవస్థను వ్యవస్థీకరిస్తాడు. అందువల్లనే తౌహీద్ ఒకే దైవవాదం తరువాత రిసాలత్ (దైవదౌత్యం)ను విశ్వసించనంత వరకు మనిషి క్రియారూపంలో 'ముస్లిమ్' కాజాలడు.

(13) ఇస్లామ్‌లో రసూల్ (దైవ సందేశహరుడు) స్థానం ఎంతో విశదంగా నిర్వచించబడింది- దైవ సందేశహరుడు అంటే ఏమిటో, ఏమి కాదో కూడా మనం నిక్కచ్చిగా తెలుసుకోగలం.

దైవ ప్రవక్త ప్రజల్ని తనకు దాసులుగా కాదు, దేవునికి దాసులుగా చెయ్యడానికి ఆవిర్భవిస్తాడు. ఆయన స్వయంగాను తన్నుతాను అల్లాహ్ దాసుడుగానే చెప్పుకుంటాడు. నమాజ్‌లో దినానికి కనీసం 17 పర్యాయాలు పఠించాలని ఏ కలిమయె షహాదత్ (సాక్ష్యవచనం)ను మహాప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లం ప్రబోధించారో, అందులో ఈ మాటలు తప్పని సరిగా ఉంటాయి. ముహమ్మద్ (స) అల్లాహ్ దాసుడు, సందేశహరుడు అని నేను సాక్ష్యం పలుకుతున్నాను. దివ్య ఖుర్‌ఆన్ ఈ విషయంలో ఇసు మంతయినా అనుమానానికి తావివ్వదు. అది తెలిపేదేమంటే ప్రవక్త మానవ మాత్రుడు, ఆయనకు దైవత్వం (Divinity)లో ఏ విధమైన భాగస్వామ్యం ఏ మాత్రం

లేదు. ఆయన మానవాతీతుడూ కాదు, మానవ బలహీనతలకు అతీతుడూ కాడు, బలహీనతలంటే నా ఉద్దేశంలో ఆకలిదప్పులు కలగడం, అలసిపోవడం, విశ్రాంతిని కోరడం, నిద్రపోవడం, వ్యాధిగ్రస్తుడవడం, గాయపడటం, సుఖ దుఃఖాల వల్ల ప్రభావితుడవడం, ఇంకా ఇలాంటి ఇతర విషయాలు ప్రతి మనిషికి పోలే మనిషే అవడం చేత ప్రవక్తకు కూడా కలుగుతాయి అని మాత్రమే. దేవునిలా ఖజానాల స్వామీ కాదు, దేవునిలా అన్నీ తెలియడానికి అగోచరజ్ఞానీ కాడు. ఆయన ఇతరులకై మేలు చేసేవాడో, కీడు చేసేవాడో కాగలగటం అలా ఉంచి కేవలం తన కొరకు కూడా ఆయన ఎలాంటి మేలూ, కీడూ చేసుకునే అధికారం కలిగిలేడు. సందేశం అందజేయడమే ఆయన విధి. ఒకరిని సన్మార్గానికి మళ్ళించడం ఆయన అధీనంలో లేదు, లేక తిరస్కరించేవారి విచారణ చెయ్యడం, వారిపై శిక్షను అవతరింపజెయ్యడం కూడా ఆయన అధీనంలో లేదు. ఆయన స్వయంగా దైవాజ్ఞల్ని పాలించకపోతే (దైవం మన్నించుగాక), లేక తన తరఫున ఏదయినా కల్పించి దైవం వైపునకు ఆపాదిస్తే లేక దేవుని వహీలో తాను ఏ మాత్రమయినా మార్పులు చేర్పులు చేసే సాహసం చేస్తే ఆయన శిక్ష నుండి తప్పించుకోలేడు. ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) ప్రవక్తలందరిలో ఒక ప్రవక్త. దైవదౌత్యానికి మించి మరెలాంటి హోదాకు ఆయన లేరు. ఆయన తన స్వంత అధికారాన్ని ఉపయోగించి ఒకదాన్ని హలాల్ (అనుమతించబడినది) చెయ్యడానికో లేదా మరొకదాన్ని హరామ్ (నిషిద్ధం) చెయ్యడానికో అంటే దైవ అనుజ్ఞ లేనిదే స్వయంగా శాసనకర్తగా తయారవడానికి ఆయనకు అధికారం లేదు. ఆయనపై దైవం తరఫున అవతరించిన వహీని అనుసరించడమే ఆయన విధి.

ఈ విధంగా, ముహమ్మద్ (స)కు ముందు ప్రభవించిన ప్రవక్తల అనుచరులు తమ మార్గదర్శకులకు ఆపాదించిన అతిశయ గుణాలన్నిటి బారి నుండి మానవాళిని ఇస్లామ్ రక్షించింది. కడకు వారిని (వారి అనుచరులు)

దైవంగా, దేవుని సమజాతీయునిగా, దైవసమానుడుగా, దైవ సంతానంగా, దైవావతారం (Incarnation)గా నిర్ణయించుకున్నారు. ఇలాంటి అతిశయా లన్నింటినీ కాదని, ఇస్లామ్ సూచించే దైవప్రవక్త అసలు పరిస్థితి ఇది:

ప్రవక్తను విశ్వసించకుండా ఏ వ్యక్తీ విశ్వాసి (మోమిన్) కాజాలడు ప్రవక్త విధేయతను పాటించినవాడు వాస్తవానికి అల్లాహ్ విధేయతను పాటించి నట్లే. ఎందుకంటే, అల్లాహ్ ఏ ప్రవక్తను పంపినా ఆయన్ని అనుస రించడానికే పంపాడు. ప్రవక్తను అనుసరించినవాడే సన్మార్గం పొందగలడు. ప్రవక్త ఇచ్చిన ఆజ్ఞను శిరసావహించాలి. ఆయన నిషేధించినదాన్ని మానుకోవాలి. (ఈ విషయాన్ని స్వయంగా మహాప్రవక్త ఇలా విశదీకరించారు. "నేనూ ఒక మానవమాత్రుణ్ణే. మీ ధర్మం విషయంలో నేను ఇచ్చే ఆజ్ఞల్ని పాలించండి. నా సొంత అభిప్రాయాన్ని దేన్నయినా వెలిబుచ్చితే- నేనూ ఒక మనిషినే- మీ ప్రాపంచిక విషయాలు మీరే బాగా ఎరుగుదురు). మహాప్రవక్త సున్నత్ (సంప్రదాయం) వాస్తవానికి దివ్య ఖుర్ఆన్ వివరణ, ఈ వివరణను దివ్య ఖుర్ఆన్ రచయిత అయిన అల్లాహ్ స్వయంగా ఆయనకు బోధించాడు. అందువల్ల ఆయన వివరణకు వెనుక దైవ ప్రామాణికత (Authority) కలదు. దాన్ని వదలి ఏ వ్యక్తికయినా దివ్య ఖుర్ఆన్ వివరణ స్వతహాగా చేసే అధికారం లేదు. అల్లాహ్ ప్రవక్త జీవితాన్ని ఆదర్శ జీవితంగా నిర్ణయించాడు. ప్రవక్త నిర్ణయాన్ని స్వీకరించని వ్యక్తి ఎవ్వడూ మోమిన్ (విశ్వాసి) కాజాలడు. దైవమూ దైవప్రవక్త ఏ విషయం కోసమైతే ఒక నిర్ణయం చేసివేశారో ఆ విషయంలో తాము ఒక నిర్ణయం తీసుకునే అధికారం ముస్లిములకు లేదు. అంతేకాదు, ఎదురైన ఒకానొక వ్యవహారంలో ఒక నిర్ణయం తీసుకునేముందు, ఆ విషయంలో అల్లాహ్, ఆయన ప్రవక్త ఇచ్చిన ఆదేశం ఏమిటో తెలుసుకోకుండా నిర్ణయం తీసుకోవటం కూడా ముస్లిమ్‌లకు తగదు.

పై విషయాల వల్ల తేలిందేమంటే, అల్లాహ్ తన ప్రవక్త ద్వారా మనిషికి కేవలం ఒక సర్వోన్నత శాసనం (Supreme Law) మాత్రమే ఇవ్వలేదు. శాశ్వత విలువలు (Permanent Values) కూడా అనుగ్రహించాడు. దివ్య ఖుర్‌ఆన్, సున్నత్‌లలో దేన్నయితే మంచిగా పరిగణించడం జరిగిందో అది చిరకాలానికి మంచి అవుతుంది. మరి దేన్నయితే చెడుగా పేర్కొనబడిందో అది నిత్యం చిరకాలానికి చెడు అవుతుంది. ఏదయితే విధిగా నిర్ణయించబడిందో అది ఎల్లప్పటికీ విధియే. ఏ విషయం హలాల్ (అనుమతించబడింది)గా పరిగణింపబడిందో అది ఎల్లకాలం హలాలే, మరి దేన్నయితే హరామ్ (నిషిద్ధమయినది)గా సూచింపబడిందో అది ఎప్పటికయినా హరామే. ఈ శాసనంలో ఏ విధమయిన సవరణలు, మార్పులు చేర్పులు లేక రద్దు (Abrogation) చెయ్యడానికి ఎవరికీ అధికారం లేదు. ఏ వ్యక్తి అయినా, ఏ సమాజమయినా, ఏ జాతీయులయినా, ఇస్లామ్‌నే విడనాడ సంకల్పిస్తే తప్ప ముస్లిమ్‌లు ముస్లిమ్‌లుగా ఉన్నంత కాలం వారికై నిన్నటి కీడు నేటి మేలై ఎల్లుండి తిరిగి కీడుగా మారిపోవడం సాధ్యపడదు. ఎలాంటి "కియాస్", "ఇజ్తిహాద్", "ఇజ్మా" కూడా ఇలాంటి మార్పుకు అధికారం కలిగిలేదు.

(14) ఇస్లామ్ మూడవ మౌలిక విశ్వాసం, ఆఖిరత్ (పరలోక జీవితం) దీని ప్రాముఖ్యత ఏమంటే, దీన్ని తిరస్కరించినవాడు కాఫిర్ (అవిశ్వాసి) అవుతాడు. దేవుణ్ణి, ప్రవక్తను, దివ్య ఖుర్‌ఆన్‌నీ, తదితర విషయాల్ని నమ్మటం అతన్ని కుఫ్ర్ (తిరస్కార పరిస్థితి) నుండి రక్షించలేవు. ఈ విశ్వాసం విశద రూపంలో ఆరు అనివార్య భావాల ద్వారా వ్యక్తమవుతుంది.

(1) మనిషి ప్రపంచంలో బాధ్యతారహితుడు (Irresponsible)గా వదలివేయబడలేదు. అతడు తన సృష్టికర్త ఎదుట జవాబు చెప్పుకోవలసి ఉంది. ప్రపంచపు ప్రస్తుత జీవితం వాస్తవానికి

మనిషిని పరీక్షించడానికే నిర్దిష్టమయింది. ఇది అంతమైన పిదప అతడు తన జీవిత కార్యకలాపాల లెక్కలు దైవానికి సమర్పించుకోవాలి.

(2) ఈ విచారణ కొరకు అల్లాహ్ ఒక సమయాన్ని నిర్ణయించాడు. మానవాళికి ప్రపంచంలో ఎంత కాలం వరకు మనుగడ సాగించే వ్యవధి ఇవ్వాలని అల్లాహ్ నిర్ణయిస్తాడో, దాని అంతంలో ప్రళయం ఏర్పడుతుంది. అందులో ప్రపంచపు ప్రస్తుత వ్యవస్థ తారుమారయిపోతుంది. మరొక వ్యవస్థ క్రొత్త పంథాలో నిర్మించబడుతుంది. ఆ క్రొత్త ప్రపంచంలో సృష్టి ఆది నుండి ప్రళయం వరకు పుట్టిన మానవులంతా తిరిగి సజీవంగా నిలబెట్టబడతారు.

(3) అప్పుడు వారందరూ ఒకేసారి లోకనాధుని న్యాయస్థానంలో హాజరుపరచబడతారు. అప్పుడు ప్రతి వ్యక్తి తన సొంత బాధ్యతపై ప్రపంచంలో తాను చేసిన చర్యలకు వ్యక్తిగతంగా సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది.

(4) అక్కడ అల్లాహ్ కేవలం తన స్వంత జ్ఞానానికి ఆధారంగా తీర్పు చెయ్యడు. న్యాయం జరిగే షరతులన్నీ పూర్తి చెయ్యబడతాయి. ప్రతి వ్యక్తి జీవిత కార్యకలాపాల రికార్డు మొత్తం హెచ్చుతగ్గులు లేకుండా న్యాయస్థానం ముందుంచబడుతుంది. ఆ వ్యక్తి గుప్తంగా, బహిరంగంగా ఏమేమి చేశాడో, ఏ సంకల్పంతో చేశాడో అన్న విషయాన్ని రుజువుపరచడానికి అసంఖ్యాక విధాల సాక్ష్యాలు అక్కడ సమర్పించబడతాయి.

(5) అల్లాహ్ న్యాయస్థానంలో ఎలాంటి లంచం, మరే విధమైన

అనుచితమయిన సిఫారసు, సత్యవిరుద్ధమయిన వకాల్తా సాగదు. ఒకరి భారాన్ని మరొకరిపై వెయ్యడం జరగదు. అత్యంత సన్నిహిత బంధువు లేక మిత్రుడు, లేక నాయకుడు లేక మతగురువు లేక మానవ నిర్మిత ఆరాధ్యుడు ఎవరి సహాయానికైనా ముందుకురాడు. మనిషి అక్కడ ఏకాకిగా పూర్తిగా నిరాశ్రితుడుగా నిలబడి తన లెక్క ఇచ్చుకుంటాడు. తీర్పు కేవలం అల్లాహ్ అధీనంలో మాత్రమే ఉంటుంది.

(6) మనిషి ప్రపంచంలో ప్రవక్తలు చూపిన సత్యాన్ని స్వీకరించి పరలోకంలో తాను జవాబు చెప్పుకోవలసిన బాధ్యతను గ్రహించి అల్లాహ్ దాస్యం సరిగ్గా చేశాడా లేదా అన్న మాటపైనే తీర్పు పూర్తిగా ఆధారపడి ఉంటుంది. తొలి రూపంలో అతనికి స్వర్గం, రెండవ రూపంలో నరకం లభిస్తాయి.

(15) ఈ విశ్వాసం మూడు రకాల మనుషుల జీవిత విధానాలను విభిన్నపరుస్తుంది. ఒక కోవకు చెందినవారు పరలోకాన్ని నమ్మరు. కేవలం ఇహలోక జీవితాన్నే నిజమయిన జీవితంగా భావిస్తారు. కర్మల ఏ పరిణామా లయితే ఈ ప్రపంచంలో వెలువడుతాయో వాటినే వీరు మంచీ చెడుల ప్రమాణంగా భావిస్తారు. ఏ చర్యకు ఫలితం ఇక్కడ మంచి లాభకరంగా గోచరిస్తుందో వీరి వద్ద అదే మంచీ, ఏ చర్యకు పరిణామం చెడుగా, నష్టకరంగా గోచరిస్తుందో అదే వీరి వద్ద చెడు. ఇంకా, తరచుగా కార్యాల ఫలితాల రీత్యా ఒకే విషయం ఒక సమయాన మంచిదైతే, మరో సమయాన చెడుగా రూపొందుతుంది.

రెండవ కోవకు చెందినవారు పరలోకాన్నయితే నమ్ముతారు. కాని ఒకరి సిఫారసు వారిని అల్లాహ్ న్యాయస్థానంలో రక్షిస్తుందనీ లేక వారి పాపాలకు

పరిహారం ముందే ఒకరు చెల్లించారనీ లేక వారు అల్లాహ్‌కు ప్రేమపాత్రులు కావడంచేత మహా పాతకానికి కూడా నామమాత్రంగా శిక్ష విధించబడుతుందనే భరోసా కలిగి ఉంటారు. ఈ విషయం పరలోక విశ్వాసం నైతిక ప్రయోజనాలన్నింటినీ హరింపజేసి రెండవ కోవకు చెందినవారిని కూడా మొదటి కోవకు చెందినవారి జాబితాలో చేర్చివేస్తుంది.

మూడవ కోవకు చెందినవారు పరలోక విశ్వాసాన్ని సరిగ్గా ఇస్లామ్ వారికి అందించిన విధంగానే నమ్ముతారు. ఇంకా ఏదైనా పాప పరిహారం, అనుచితమైన సిఫారసు, లేక అల్లాహ్‌తో ఏదో ప్రత్యేక సంబంధం లాంటి అపోహలకు లోనుకారు. వీరికై ఈ నమ్మకం మహత్తరమైన నైతిక బలం. ఏ వ్యక్తి అంతరాత్మలో పరలోక విశ్వాసం, దాని నిజరూపంలో స్థానమేర్పరచుకుంటే అతన్ని ప్రతి చెడు పని సంకల్పంపై హెచ్చరించే, ప్రారంభంపై వారించే, చర్యపై భీతిగొలిపే ఒక సంరక్షకుడు, కావలివాడు ప్రతినిత్యం అతనితోబాటు ఉన్నట్లే అవుతుంది అతని పరిస్థితి. బయట పట్టుకునే పోలీసు, సాక్ష్యమిచ్చే సాక్షి, శిక్ష విధించే న్యాయస్థానం, దూషించే ప్రజాభిప్రాయం ఉన్నా లేకపోయినా అతనిలో ఒక కఠినుడయిన కాపరి నిత్యం తిష్టవేసి ఉంటాడు. అతని పట్టు భయంచేత అతడు, ఒంటరిగా ఉన్నప్పుడు, లేక అడవిలో లేదా చీకట్లో లేదా నిర్మానుష్య ప్రదేశంలో కూడా దైవం విధించిన విద్యుక్త ధర్మాన్నుండి తప్పుకుపోయే, ఆయన నిర్ణయించిన నిషిద్ధాన్ని అతిక్రమించే సాహసం చెయ్యలేడు. ఒకవేళ చేసివేసినా పిదప సిగ్గుపడతాడు. పశ్చాత్తాపంతో కించపడతాడు. ఇంతకంటే గొప్ప నైతిక సంస్కరణ, మనిషిలో స్థిరమయిన స్వభావ స్వరూపాలు సృజించే మరో మార్గం లేదు. దైవిక సర్వోన్నత శాసనం (Supreme Law) మనిషికి ప్రసాదించే శాశ్వత విలువలపై పటిష్టంగా మనిషి నడుచుకోవాలంటే, వాటిని ఎట్టి పరిస్థితిలోనూ జవదాటరాదంటే, అది ఈ విశ్వాసంపైనే ఆధారభూతమై

ఉంది. అందువల్లనే ఇస్లామ్‌లో దీనికి అంతటి ప్రాముఖ్యత ఇవ్వబడింది, ఇదే లేకపోతే దైవం, దైవదౌత్యంపై విశ్వాసం కూడా వ్యర్థమే.

(16) పేరాగ్రాఫ్ నెం.6లో తెలిపినట్లు ఇస్లామ్ ఒక సంపూర్ణమయిన సంస్కృతి, సమగ్రమైన నాగరికత, సర్వవ్యాప్తమయిన (Comprehensive) జీవన వ్యవస్థ, మానవ జీవితం సమస్త విభాగాలకు నైతిక మార్గదర్శకత్వం ప్రసాదిస్తుంది. అందువల్ల దీని నైతిక శిక్షణలు వాస్తవానికి ప్రపంచాన్ని త్యజించిన బైరాగులకో లేక యోగులూ సన్యాసులకో కాదు, జీవితపు వివిధ రంగాలను నడిపిస్తూ లేదా వాటిలో పాల్గొంటూ ఉన్నవారికే. ఆశ్రమాలలో, మఠాలలో, మందిరాలలో ఏ నైతిక ఔన్నత్యాల కొరకు ప్రపంచం అన్వేషించేదో వాటిని ఇస్లామ్ జీవితపు నడిసముద్రంలో సుడిగుండంలో తేవాలని వాంఛిస్తోంది. అది కోరేదేమంటే ప్రభుత్వాల పరిపాలకులు, రాష్ట్రాల గవర్నర్లు, న్యాయస్థానాల జడ్జీలు, సైన్యం, పోలీసు అధికారులు, పార్లమెంటు సభ్యులు, ఆర్థిక పారిశ్రామిక కళారంగాల నిర్వాహకులు, కళాశాలల విశ్వవిద్యాలయాల ఆచార్యులు, విద్యార్థులు, పిల్లల తండ్రులు, తండ్రుల పిల్లలు, స్త్రీల భర్తలు, పురుషుల భార్యలు, పొరుగువారి పొరుగువారు- ఒక్కరేమిటి అందరూ సద్గుణ సంపన్నులవ్వాలి; నైతికతతో అలంకృతులవ్వాలి; ఇంటా బయటా అదే నైతికత రాజ్యమేలాలనీ, వీధుల్లో బజారుల్లో కూడా అదే నైతికత చెలామణి అవ్వాలనీ అది వాంఛిస్తుంది; వాణిజ్య సంస్థలన్నీ, ప్రభుత్వపు విభాగాలన్నీ దీన్నే అనుసరించాలని అది వాంఛిస్తుంది; రాజకీయాలు, సత్యం న్యాయాల ఆధారంగా నడవాలి; జాతులు సత్య ప్రేమతో ఆ హక్కులను నెరవేర్చే భావంతో పరస్పర వ్యవహారాలను చక్కదిద్దుకోవాలి; యుద్ధం జరిగినా సంస్కారవంతంగా సభ్యంగా జరగాలి- తోడేళ్ళ వలె కిరాతకంగా కాదు. మనిషి దైవభక్తిని అవలంబిస్తే, దైవ శాసనాన్ని సర్వోన్నతమని అంగీకరిస్తే దేవుని సమక్షంలో తాను జవాబు

చెప్పుకోవలసి ఉందనే బాధ్యతను జ్ఞాపకముంచుకుని శాశ్వత విలువలను తప్పకుండా పాటించడం మొదలెడితే అప్పుడు అతని ఈ గుణం కేవలం ఆరాధనాలయం వరకే పరిమితం కాకూడదు. అతడు ఏ స్థితిలో, ఏ హోదాలో, ఏ స్థానంలో ప్రపంచాన పని చేసినా దేవుని నిజమైన విశ్వాసిగా, దాసునిగానే పని చెయ్యాలి.

ఇస్లామ్ దేన్నయితే చాటుతుందో, వాంఛిస్తుందో దాన్ని క్లుప్తంగా పైన వివరించడం జరిగింది. ఇది కేవలం ఒకానొక తత్వవేత్త ఊహాజనిత స్వర్గం (Utopia) కాదు. మహా ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) దీన్ని క్రియాత్మకంగా నెలకొల్పి చూపారు. 14 వందల ఏళ్ళు గడిచినా దాని ప్రభావాలు కాస్త హెచ్చుతగ్గులతో ముస్లిమ్ సమాజంలో నేటికీ కానవస్తూనే ఉన్నాయి.

- : సమాప్తం : -